గలవు. అట్లు దేశాటనముచేసియు, ప్రతిభావ్యాపారమున నఖండపరిశ్రమము కావించియు వైషయికవర్తనమున నగ్య్రకోటి నధిష్ఠించియు, ముగ్గతిలఁబడక చిరజీవితము సాగించు కొనఁగల్గినవానికిఁ దిన్నని మేలయిన యాహారవిహారములు పొసఁగక యెట్లు? కలవు చాటుపద్యము లీసందర్భమునఁగొన్ని ఉదాహరింప మనసొల్లకున్నది. ఒకానొక చాటుధార యాతఁడు విశాలోన్నతకాయుఁడని తెలుపుచున్నది. అతని భోజనప్రీతిని దెలుపు చాటుధారలును గ్రంథభాగములును గొన్ని చూపుచున్నాను:

గోధూమసేవికాగుచ్ఛంబు లల్లార్చి—(నైషధము) ఖండశర్కరజున్ను—(భీమఖండము). ఇత్యాదిపద్యములును,

ఉ. పప్పును బిండివంటలును బానకముల్ ఘృతముల్ గుడంబులున్
(?)గుప్పలుగాఁగఁ జుట్టునను గూర్పఁగఁగూడిన యేరుఁబ్రాలతె
ల్గప్పురబోగివంటకము గమ్మని తాలిపుసాజపిండితో
నొప్పలుగా భుజించిరి బుధోత్తము లాఁకటిచిచ్చుపెచ్చునన్.

శా. ద్రాక్షాపానకఖండశర్కరలతో రంభాఫలశ్రేణితో
గోక్షీరంబులతోడ మండెఁగలతోఁ గ్రొన్నేతితోఁ బప్పుతో
నక్షయ్యంబగు నేరుఁబ్రాలకల మాహారంబు నిశ్శంకతన్
గుక్షుల్ నిండఁగ నారగించితిమి యక్షుద్రక్షుధాశాంతికిన్.

వీథినుండి:—

ఉ. కప్పురభోగివంటకముఁ గమ్మని గోధుమపిండివంటయున్
గుప్పెడు పంచదారయును క్రొత్తగఁగాచిన యాలనేపెస
ర్పప్పును గొమ్మనల్లనఁటిపండ్లును నాలుగు నైదు నంజులున్
అప్పలతోడఁ గ్రొంబెరుగు లక్ష్మణవజ్ఝలయింట రూకకున్.

కాశీఖండమున:

"వ. అనంతరం బావిశాలాక్షీమహాదేవియును భావంబున నమ్మహామునులముందటఁ గనకరంభాపలాశపాత్రంబుల యందు, విచిత్రంబుగాఁగల వంటకంబులు, నపూపంబులు, లడ్డువంబులు, నిడ్డెనలు, కుడుములు, నప్పడంబులు, నిప్పట్లు, గోళ్లెడలు, జిల్లేడుకాయలు, దోసియలు, సేవియలు, నంగరపోలియలు, సారసత్తులు, బొంతరకుడుములు, జక్కిలంబులు, మడుఁగుఁబూవులు, మోరుండలుఁ, బుండ్రేక్షుఖండంబులు, పిండ ఖర్జూరద్రాక్షానారికేళకదళీపనసజంబూచూతలికుచదాడిమీకపిత్థకర్కంధూఫలంబులు, గసగసలు, పెసరుంబులుఁగములు, చెఱకు గుడములు, నరిసెలు, బిసకిసలయముల వరుగులు, చిరుగడములు, బడిదెములు, బులుపలు, బులివరకలు, (నప్పడంబులు), బప్పురొట్టియలు, చాఁపట్లు, పాయసంబులు, కర్కరీకారవేల్ల కూశ్మాండ నిష్పావపటోలికా కోశాతక్యలాబూసిగ్రూదుంబరవార్తాక బింబికా కరవిందశలాటువులును గందయుం బొందయుఁ జారులుఁ దియ్యగూరలుఁ బచ్చడులు బజ్జి

లు, గిజ్జఱులు వడియంబులుఁ గడియంబులు గాయంబులు గంధ త్రోయంబులు, సుండ్రాలు, నానుబ్రాలును, ననుములు, మినుములు, బుడుకులు, నడుకులు, నిలిమిడియును జలిమిడియును, ద్రబ్బెడయు, వడయును. నుక్కెరలు, చక్కెరలు, నేతులుఁ, దేనెత్రోలలు, బిట్టును, గట్టును, బాలతిమ్మనంబులును, దోఁపలు పూఁపలు, మోదకంబులు, గుడోదకంబులు, ముక్కులుముతెయని చొక్కంపుఁజేకుఁబ్రాల మిలమిలని రాజనంపుమడుంగు టోగిరంబులు, పాడబంబులతోడం బానకంబులతోడం దిమ్మనంబులతోడ దధిపిండఖండంబులతోడ మీఁగడలతోడ మజ్జిగలతోడ నూరుఁగాయలతోడ నంబకబళంబులతోడ రసావళులతోడంగూడి బుగబుగమను బోగపుఁగంపులతోడం బ్రతిభటించు రామతామోదంబును, రామతామోదంబుతో మంతనంబాడు మెంతులనెత్తావులు, మెంతులనెత్తావులతో బిత్తరించు జీరకంబుల సౌరభంబును, జీరకంబుల సౌరభంబుతోడం దర్స్తరించు కుస్తుంభరికిసలయవాసనలును, గుస్తుంభరికిసలయవాసనలతోడం బిసాళించు కఱివేఁపాకుఁబరిమళంబును, గఱివేఁపాకుఁ బరిమళంబుతో సంబంధించు, కమ్మకసిందగంధంబును, గమ్మకసిందగంధంబుతోడం దార్కొను నేలకుల సౌరభంబును, నేలకుల సౌరభంబులతో సాళగించు కాలాగురుకురంగనాభికాకర్పూరగంధసారనీహారవాఃపూరంబులతోడం గలహించు మహిసాక్షిగుగ్గులు ధూపధూమంబుల

కమ్మఁదనంబును భోజనాగార గవాక్షమార్గంబుల వెడలి కాశికానగరఘంటాపథములం బౌరనాసికాపుటకుటీరములకుం గుటుంబకంబుగా మిరియంబు పెరిమోయుఁ, బసపుఁబసయు, శొంఠిసొబగు, నావ తేవయు, సింధుప్పుచాగయుఁ గరాం(?)బువు మావ్రాఁబును, బిప్పలియొప్పును, నల్లంబు మొల్లంబును, జంతి గొజ్జురజ్జును, జేలపిండియొప్పును, నిప్పపూమొగ్గల యగ్గలికయు, వెన్నపెన్నాటకంబును, గలిగి యొకొక్కకమటియుఁ దన కుందాన నులివేఁడికట్లావితో నావిర్భవించిన"—

మతము.

శ్రీగురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారు తిక్కనను గూర్చి వ్రాయుచు శ్రీనాథుని యోగ్యత నిట్లు చిమకఁగొట్టినారు:

"ఇదియుమగాక వేదవేదాంతార్థములు కేవలము తెలిసినను దదుక్తకర్మాచరణము లేనివారల కట్టిపట్లు తెలిఁగింప సమర్థతయుండదని శ్రీనాథుఁడు తానట్టివాఁడు కాకుండుటం బట్టి యూహించియుండును. శ్రీనాథుఁడేగాక యాతని తండ్రియుఁ దాతయుగూడ వైదికసంపత్తి లేనివారే. తిక్కనసోమయాజివంశ మట్టిదిగాదు. తిక్కనసోమయాజితండ్రి సాంగ వేదవేది యయియుండెఁ. తిక్కనసోమయాజి వేదవేదాంగముల నేర్చినవాఁడేగాక వైదికమార్గనిష్ఠమగు వర్తనమును నిర్వహిం

చునట్టి యజ్వగానుండెను. కావునఁ బైవిషయములో శ్రీనాథుఁడు తనకంటెను భారతామ్నాయమును దెనిఁగించుటకుఁ దిక్కన యొక్కఁడే లౌకికవైదికములు రెండింటను సమర్థుఁడని యెంచి యారీతిగా వర్ణించెను."

శ్రీనాథుఁడు వైదికాచారదూరుఁడనుటకుఁ దగిన యాధారములేదు. ఆతని తాతతండ్రులనుగూర్చి మనకేమియు నెఱుఁగరాదు. నిరాధారముగా శ్రీరామమూర్తిగారు నెలకొల్పిన పయివిషయము మనకు నిరాకరింపఁదగినది. శ్రీనాథుఁడు వేదాదివిద్యాసంపన్నుఁడనుట కనేకాధారము లున్నవి. హరవిలాసమున—'పరమపుణ్య' 'కులపవిత్ర' 'అఖిలపురాణవిద్యాప్రవీణ', 'అధ్వర్యువేదశాఖాదీక్షానిష్ణాత' 'ఆగమజ్ఞాననిధి' 'తత్త్వార్థఖని' బహుపురాణజ్ఞ' పదము లున్నవి. నైషధమున 'ఈశ్వరార్చనకళాశీలుఁ'డనియున్నది. కాశీఖండమున దీతని వైదికవిద్యాసంపత్తిని దెలుపు భాగము లనేకములున్నవి. పంచబ్రహ్మషడంగమంత్రములతోఁ బ్రాసాదపంచాక్షరి నీతఁడు బహువారములుస్మరించినాఁడు. పట్టిసక్షేత్రవాసియగు భీమయదేశికున కీతఁడు శిష్యుఁడుగదా! శ్రీనాథుఁ డుపనిషద్వాక్యములు పెక్కులుకాశీఖండమం దుదాహరించినాఁడు. శబ్దశాస్త్రజ్ఞుల స్ఫోటాదివాదముల నెఱిఁగినాఁడు. పాతంజలయోగదర్శనమం దీతనికిఁ బరిసిష్ఠ హెచ్చు. శివపారమ్యమం దాదర మెక్కువ. కాని విష్ణు

ద్వేషముగల వీరశైవుల శ్రోత్రవాఁడీతఁడుగాఁడు. ఒక రీతిఁడు లింగధారినియోగిబ్రాహ్మణుఁడని తలంచిరి. నాకది యంగీకారార్హముగాఁ దోఁపదు. లింగధారులకు విష్ణుద్వేషము విహితము. ఈతని కదిలేదు. అద్వైతమందే యాస్థ కానవచ్చును. బహుభేదములతోఁ బరస్పర ద్వేషములతో నుండు తాంత్రికమతములం దీతనికిఁ దత్పరత యున్నట్టు తోఁపదు. "బహుధావిఖ్యాతశివ త్రిథీవిషయయుక్ వాదైనశాస్త్రార్థములా—" "బ్రహ్మాండాది మహాపురాణచయ తాత్పర్యార్థ నిర్ధారిత బ్రహ్మజ్ఞాన కళానిధానమవు" అనుపలుకు లీభావములను బలపఱుచుచున్నవి. ఈతని నాదరించిన రాజులు, రాజమంత్రులు, శైవమతాభినివిష్టులగుటచేత వారి యభిమానము చూఱ్ఱగొను నీతఁడు వీరశైవగ్రంథమగు పండితారాధ్య చరిత్రములను రచించినాఁడు. దానిఁ బట్టియే యీతఁడు లింగధారియనరాదుగదా!

## ఇతర కవులుచేసిన ప్రశంసలు.

### నాగ్నచిత్రీపరిణయము - వల్లూరి నరసింహకవి:

చ. ధనరాజ్యంబులుమాని నెమ్మదిఁ బ్రమోదంబంది తన్గోరునట్టి నృపాలాగ్రణి కోర్కి తీర్చుట కకుంఠీభూతచేతస్కుఁడై
చని సాధించిన సత్కవిప్రవరు గాజన్యాగ్రణీమాన్యు నేఁ
బ్రణుతింతుక్ బహుశైవసంగదిత శుంభద్గాథు శ్రీనాథునిక్.

## తారకబ్రహ్మరాజీయము - రాధామాధవకవి:

శా. సూనాస్త్రప్రమదామదస్ఫురిత వక్షోజాతకాఠిన్యముల్
బూనం జాలు వచోవిలాసముల నింపుల్ మీఱఁ గర్ణాటక
క్ష్మానాథేంద్రుసభం గవిత్వవిజయోత్సాహంబు గైకొన్న మా
శ్రీనాథుం గవిసార్వభౌముఁ గొలుతున్ సేవాంజలుల్ గీల్కొనన్.

## మొల్లరామాయణము - కుమ్మరమొల్ల:

సీ. గీ. స్తుతగుణోద్దాము నాచనసోము భీము
నవ్యమంజుల వాగ్ధుర్య నన్నపార్యు
రసికుఁడైనట్టి శ్రీనాథు రంగనాథుఁ
దిక్కకవిరాజును నుతించి ధీరిమించి.

## వసుచరిత్రము - భట్టుమూర్తి.

మ. మహి మున్ వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు త
న్మహనీయస్థితి మూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్ మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపు వాటిల్లు నీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమునఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్.

## శృంగారశాకుంతలము . పినవీరన.

సీ. నన్నపార్యుని ప్రబంధప్రౌఢవాసనసంపత్తి సొంపు పుట్టింప నేర్చు
దిక్కన యజ్వ వాక్ఫక్కి కామోదంబు చెలువు కర్ణముల వాసింప నేర్చు
నాచిరాజునిసోము వాచామహత్త్వంబు సౌరభంబులు వెదచల్ల నేర్చు
శ్రీనాథభట్టు భాషానిగుంభంబుల పరిమళంబులు గూడఁ బఱచ నేర్చు
గీ. మహితగుణశాలి పిల్లలమఱ్ఱి వీర। నార్యుఁ డాయింటఁ బైతామహంబగుచును
వెలయుచున్నది నేఁడుకవిత్వలక్ష్మి । యఖిలసత్కవినికరంబు నాదరింప॥

సాంబోపాఖ్యానము - రామరాజు రంగప్పరాజు:

సీ. అభివందనసహస్రమర్పించి నన్నయభట్టుమార్గము కొంత పరిఢవిల్ల
తిక్కనమఖిసూక్తి ఫక్కిక యొకకొంత పెనుపొంద నెఱ్ఱప్రెగడఫణితి
యొకకొంత తులకింప నొకకొంత నాచన సోము గీర్వైభవంబు సొంపుమీఱ
త్రిపురాంతకుని వచస్స్థేమంబు నొకకొంత కొరలశ్రీనాథోక్తికొంతనిగుడ
గీ. మఱియుఁదక్కినసుకవుల మధురవచన। రచనలును గొంత రాణింప రసనిబంధ
బంధురముగాఁగ నెనిచ్చు భవ్యకావ్య। హీరముసముఁగథాక్రమం బెట్టులనిన.

పట్టమెట్ట సోమనాథసోమయాజి-సూతసంహిత:

సీ. సర్వజ్ఞచూళిభూషణమైన శబ్దశాసను బహుముఖ రసజ్ఞతఁ దలంచి
యోగ్యశ్రుతిహితప్రయోగుఁడౌ సోమయాజులరీతి వృత్తిసంశుద్ధి నెన్ని
నిర్దోష సుసమాధినియతోక్తియగు శంభుదాసు ప్రసాదపాత్రత నుతించి
నిస్తులౌజఃకాంతినిధులైన సోమభాస్కరుల శబ్దగుణప్రసక్తిఁ బొగడి
గీ. రుచిరపదసిద్ధధారానిరూఢమహిమఁ। దగిన శ్రీనాథు నచ్యుతత్వము గ్రహించి
తత్కవిత్వకథాసుధాధానసంత। తావధానైకచిత్తుఁడనై కడంగి.

చారుచంద్రోదయము (చెన్నమరాజు.):

సీ. ప్రకృతికృదవ్యయ ప్రత్యయ సుప్రతిష్ఠాధను శబ్దశాసను భజించి
సరసమాళిప్రియంకర పదాలంకారవృత్తిసాంద్రుని గుండలీంద్రునెంచి
సర్వజ్ఞగణమనస్సంప్రీతికరకవిత్వవిలాసు నలశంభుదాసుఁ బొగడి
బహుముఖప్రఖ్యాత మహితశయ్యా విశేషసనాథు శ్రీనాథు సన్నుతించి
గీ. అధికలక్షణసంపన్నులై తనర్చు। భైరవు ననంతు భీమునిఁ బ్రణుతిచేసి
పృథివి నెంతయు వాణీధురీణులయిన। యన్యతనసత్కవీంద్రుల నాత్మఁదలఁతు

బహుళాశ్వచరిత్ర—(సవరము చిననారాయణకవి):

మ. ఉపమానైపుణిఁ గాళిదాసు నఖిలార్థోత్పాదనా భారవుల్
సుపదస్థాపనరూఢి దండికవిరాజుల్ జాతివార్తారస

## తారకబ్రహ్మరాజీయము - రాధామాధవకవి:

శా. సూనాస్త్రప్రమదామదస్ఫురిత వక్షోజాతకాఠిన్యమున్
బూనంజాలు వచోవిలాసముల నింపుల్ మీఱఁ గర్ణాటక
క్ష్మానాథేంద్రుసభఁ గవిత్వవిజయోత్సాహంబు గైకొన్న మా
శ్రీనాథుం గవిసార్వభౌముఁ గొలుతున్ సేవాంజలుల్ గీల్కొనన్.

## మొల్లరామాయణము - కుమ్మరమొల్ల:

సీ. గీ. స్తుతగుణోద్దాము నాచనసోము భీము
నవ్యమంజుల వాగ్ధుర్యు నన్నపార్య
రసికుఁడైనట్టి శ్రీనాథు రంగనాథుఁ
దిక్కకవిరాజును నుతించి ధీరిమించి.

## వసుచరిత్రము - బట్టుమూర్తి.

మ. మహి మున్ వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు త
న్మహనీయస్థితి మూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్ మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపు వాటిల్లు నీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమునఁ దత్ప్రాగల్భ్యమూహించెదన్.

## శృంగారశాకుంతలము పినవీరన.

సీ. నన్నపార్యుని ప్రబంధప్రౌఢవాసనసంపత్తి సొంపు పుట్టింపనేర్చు
దిక్కన యజ్వవాక్శక్తి కామోదంబు చెలువు కర్ణముల వాసింపనేర్చు
నాచిరాజునిసోము వాచామహత్త్వంబు సౌరభంబులు వెదచల్లనేర్చు
శ్రీనాథభట్టు భాషానిగుంభంబుల పరిమళంబులఁగూడఁ బఱచనేర్చు
గీ. మహితగుణశాలి పిల్లలమఱ్ఱి వీర|నార్యుఁ డాయింటఁ జైతామహంబగుచును
వెలయుచున్నది నేఁడుకవిత్వలక్ష్మి | యఖిలసత్కవినికరంబు నాదరింప॥

సాంబోపాఖ్యానము – రామరాజు రంగప్పరాజు:

సీ. అభివందనసహస్రసమర్పించి నన్నయభట్టుమార్గము కొంత పరిఢవిల్ల
తిక్కనమఖిసూక్తిశక్తికొకకొంత పెనుపొంద నెఱ్ఱాప్రెగడఫణితి
యొకకొంత తులకింప నొకకొంత నాచన సోము గీర్విభవంబు సొంపుమీఱ
త్రిపురాంతకుని వచస్స్థేమంబు నొకకొంత కొరలశ్రీనాథోక్తికొంతనిగుడ
గీ. మతియుఁదక్కినసుకవుల మధురవచన। రచనలును గొంత రాణింప రసనిబంధ
బంధురముగాఁగ నేనిచ్చు భవ్యకావ్య। హారమునఁగథాక్రమం బెట్టులనిన.

పట్టమెట్ట సోమనాథసోమయాజి-సూతసంహిత:

సీ. సర్వజ్ఞచూళిభూషణమైన శబ్దశాసను బహుముఖరసజ్ఞతఁ దలంచి
యోగ్యశ్రుతిహితప్రయోగుఁడౌ సోమయాజులకీర్తి వృత్తిసంశుద్ధినెన్ని
నిర్దోష సుసమాధినియతోక్తియగు శంభుదాసు ప్రసాదపాత్రత నుతించి
నిస్తులౌజఃకాంతినిధులైన సోమభాస్కరుల శబ్దగుణప్రశక్తిఁబొగడి
గీ. రుచిరపదసిద్ధధారానిరూఢమహిమఁ। దగినశ్రీనాథునచ్యుతత్వము గ్రహించి
తత్కవిత్వకథాసుధాధానసంత। తావధానైకచిత్తుఁడనై కడంగి.

చారుచంద్రోదయము (చెన్నమరాజు.):

సీ. ప్రకృతికృదవ్యయ ప్రత్యయ సుప్రతిష్ఠాధను శబ్దశాసను భజించి
సరసమాళిప్రియంకర పదాలంకారవృత్తిసాంద్రుని గుండలిందుని నెంచి
సర్వజ్ఞగణమునస్సంప్రీతికరకవిత్వవిలాసు నలశంభుదాసుఁ బొగడి
బహుముఖప్రఖ్యాత మహితశయ్యా విశేషసనాథు శ్రీనాథు సన్నుతించి
గీ. అధికలక్షణసంపన్నులై తనర్చు। భైరవు ననంతు భీమునిఁ బ్రణుతిచేసి
పృథివినెంతయు వాణీధురీణులయిన। యన్యతనసత్కవీంద్రుల నాత్మఁదలఁతు.

బహుళాశ్వచరిత్ర—(నవరము చిననారాయణకవి):

మ. ఉపమానైపుణిఁ గాళిదాసు లఖిలార్థోత్పాదనా భారవుల్
సుపదస్థాపనరూఢి దండికవిరాజుల్ జాతివార్తారస

ఢిపదోజ్జృంభణశబ్దజృంభణకళా శ్రీనాథులే కాక యే
కపదభ్రావ్యదసంప్రదాయకవు లాఘర్షింప మాబోంట్లకున్.

జానకీరాఘవము—(బేతపూఁడి కృష్ణయ):

శా. వాగీశుండు తెనుంగుపద్యకవితా వారాశిఁ గల్పింప వి
ద్యాగణ్యుండగు కుండలీంద్రుఁడు గుణాఢ్యత్వమ్మునన్ మీఱ నా
నాగీర్వాణ వచస్తతిన్ మెలఁగు శ్రీనాథుండు కావ్యామృత
శ్రీ గైకొంచు బుధాళి కిచ్చు మహితోత్సేకంబు వర్ణించెదన్.

పృథుచరిత్రము-వట్టిమొట్ట సరస్వతిసోమయాజి:

ఉ. నన్నయభట్టుఁ దిక్కమఖినాథుని నెఱ్ఱయప్రెగ్గడన్ వచః
పన్నగసార్వభౌములని భక్తిఁ దలంచి మహాప్రబంధముల్
చిన్నటనాఁటనుండియును జేసిన సత్కవిసార్వభౌమునిన్
సన్నుతిచేసెదన్ సరససాహితికావ్యము లాకలించుచున్.

చంద్రరేఖావిలాపము - కూచిమంచి జగ్గకవి:

క. భీమకవి రామలింగని
శ్రీమంతుం డైవెలుంగు శ్రీనాథకవిన్
రామకవిముఖ్యులను బ్రో
ద్దామగతిం జిత్తవీథిఁ దలఁచి కడంకన్.

బాలభాగవతము- కోనేరునాథుఁడు:

క. నన్నయభట్టార్యుని భీ
మన్నం దిక్కయ్య నెఱ్ఱయాహ్వయు శ్రీనా
థు న్నతియించెద మిగులఁ బ్ర
పన్నాత్ముల నంధ్రకావ్యజలజాసనులన్.

ఇందుమతీపరిణయము—కుమారధూర్జటి:

సీ. ..........................................................
..........................................................
..........................................................
తనదు శ్రీనాథత్వ మనుపమన్నృపసభాంతర చిత్రతరచాఉబంధురత మెఱయ

గీ. నలరు నన్నప దిక్కనాఖ్యాంధ్రకవిని। నెఱ్ఱనామాత్యు నిషధరాజేంద్రను చరి
తాంధ్రకవనవీనవాగమృతలీల । నతిశయించిన నెఱజాణ నభినుతింతు.

పరిబంధరాజవిజయ వేంకటేశ్వరవిలాసము.
—గణపవఱపు వేంకటకవి:

సీ. అలవిన్నకోట పెద్దన లక్షణజ్ఞత.

అరుణాచలపురాణము:—పెదపాటి సోమయ:

సీ. ప్రతిభావిలంఘిత భారతబహుకథాఘట్టు నన్నయభట్టుఁ గడుభజించి
ఉభయభాషాప్రౌఢిమోద్యన్మహారాజ్యభాజిఁ దిక్కనసోమయాజిఁబొగడి
వాక్ప్రదోషితదక్షవాటీమహాస్థానభీము వేములవాడభీముఁగొలిచి
భావబంధనిబంధ పరమేశబిరుదప్రశర్మ నెఱ్ఱయశర్మ సన్నుతించి

గీ. భారతీహారు భవదూరుఁ బ్రణుతిచేసి। సుకవికులసోము నాచనసోము నెన్ని
నవ్యకవితాసనాథు శ్రీనాథుఁదలఁచి। సరసకలాంధ్రకవుల కంజలియొనర్చి.

రాజరాజాభిషేకము—అంగర రామకృష్ణకవి;

క. పాథోధిపయోభర ని
ర్మాథచలద్ఘుమఘుమాయమానలహరికా
పాథేయదాయిసూక్తి స
నాథుఁ శ్రీనాథు నెమ్మనంబునఁ గొలుతుఁ.

మఱియు "నచ్యుతైకసమాఖ్య నంచితపదధారఁ బ్రకటించు శ్రీనాథసుకవివరుని" నని కోడూరు వేంకటాచలకవి శివరహస్యఖండమున శ్రీనాథునిఁ బ్రస్తుతించినాఁడు. సిరిపెగ్గడ ధర్మనాదులు కూడ పెక్కురుకవులు శ్రీనాథునిఁ బ్రస్తుతించిరి. మొత్తమునకు శ్రీనాథునిఁగూర్చి ప్రాచీనకవులుచేసిన ప్రస్తుతులాతనిశబ్దరచనాచాతుర్యమును బ్రశంసించునవిగా నున్నవి.

సమకాలము కవులు.

బమ్మెరపోతన, నిశ్శంకునికొమ్మన, దగ్గుఁబల్లి దుగ్గన, నాగనాథుఁడు, గౌరన, పినవీరభద్రుఁడు, చెన్నమరాజు, భైరవుఁడు, జక్కన, మడికిసింగన, అనంతామాత్యుఁడు, గోపురాజు, తాళ్ళపాక అన్నమయ్య, అయ్యలార్యుఁడు, నందిమల్లయ ఘంటసింగయలు మొదలగువారు తెలుఁగుఁ గవీశ్వరులును, మల్లినాథుఁడు, విశ్వేశ్వరకవిచంద్రుఁడు, బొమ్మకంటి అప్పయాచార్యుఁడు, వామన భట్టబాణుఁడు, కాటయవేముఁడు, డిండిములు మొదలగువారు సంస్కృత కవులును శ్రీనాథుని కాలమువారు. ఇందు మొదటి యయిదుగురు శ్రీనాథుని సమకాలమువారగుట యిదివఱకే నిరూపింపఁబడెను. గౌరన, హరిశ్చంద్రచరిత్ర (ద్విపద), నవనాథచరిత్ర (ద్విపద), లక్షణదీపిక (సంస్కృతము) యను గ్రంథముల రచించినాఁడు. నవనాథచరిత్రము శాంతభిక్షావృత్తిప్రేరణముచే నాతఁడు

రచించెను. ఈశాంతభిక్షావృత్తిపేరిణమున నే శ్రీనాథుఁడు గూడ ముమ్మడిశాంతియ కంకితముగా శివరాత్రిమాహాత్మ్యము రచించినాఁడు. అనుబంధమున నవనాథచరిత్రకృత్యవతరణికాభాగమును జూడఁదగును. పినవీరభద్రుఁడు శ్రీనాథుని శిష్యుఁడని ప్రతీతిగలదని యిదివఱకె వ్రాసితిని.

చెన్నమరాజకవి:—ఈతఁడు శ్రీనాథుని శిష్యుఁడే. వేంకటపతిరాయల కాలమందున్న చెన్నమరాజకవి (చారుచంద్రోదయకారుని) కితఁడు తాత. వీరేశలింగముపంతులుగారు ముత్తాతయని తప్పుగా వ్రాసిరి. దానినెల్ల నిక్కడ నిరూపింప నేల? చారుచంద్రోదయముఁజూచినఁ దెలియఁగలదు. అన్నాల చింతల చెన్నమరాజునకు లక్ష్మీపతి, కొండయ, కృష్ణయ, యని మూఁగురు కొడుకులు. లక్ష్మీపతికి వెంకట, చెన్నమరాజ, రామచంద్ర, తాంయనాఖ్యులు నల్గురు కొడుకులు. ఇందు రెండవవాఁడగు చెన్నమరాజే శ్రీనాథుని శిష్యుఁడు. పద్యమిది చదువఁదగును.

క. సన్నుతకవిత్వవిద్యా
భ్యున్నతి శ్రీనాథసుకవిపుంగవు కరుణన్
జెన్నమరున్ లక్ష్మీపతి
చెన్నమరాజప్రధానశేఖరుఁ డెలమిన్.

—చారుచంద్రోదయము.

ఈ చెన్నమరాజునకు శేషాద్రికొడుకు. శేషాద్రికి తిమ్మన, లక్ష్మీపతి, చెన్నయ, తాయన యనువారు కొడుకులు. మూఁడవవాఁడగు చెన్నయయే చాటుచంద్రోదయకారుడు.

భైరవుఁడు:—ఈతఁడు శ్రీరంగమాహాత్మ్యరత్నశాస్త్ర కవిగజాంకుశము లనుగ్రంథముల రచించినవాఁడు. ద్విపదహరిశ్చంద్రచరిత్రకర్తయగు గౌరనకుఁ గుమారుడే కావచ్చును.

జక్కన:—ఈతఁడు శ్రీనాథుని సమకాలమువాఁడో, లేక కొంచెము పూర్వకాలమువాఁడో యగును. జక్కనవిక్రమార్కచరిత్రలో శ్రీనాథుని రచనములఁబోలిన రచనము లున్నవి.

మడికిసింగన:—ఈతఁడు సరిగా శ్రీనాథుని సమకాలమువాఁడే.

అనంతామాత్యుఁడు:—ఈతఁడును సరిగా శ్రీనాథుని సమకాలమువాఁడే అంతేకాక, శ్రీనాథుని జన్మదేశమునకు మిక్కిలి దగ్గరగానున్న పెరమకూరుపురము నందున్నవాఁడు కూడను.

గోపరాజు:—ఈతఁడు పినవీరన కించుక తర్వాతివాఁడు. ద్వాత్రింశత్సాలభంజికల కథల రచించినవాఁడు.

తాళ్లపాక అన్నమయ్య:—తిరుపతి తామ్రశాసనము

లచే నీతఁడు శ్రీనాథుని సమకాలమువాఁడుగాఁ దెలియఁబడు చున్నాఁడు.

అయ్యలార్యుఁడు:— ఈతఁడు వేదగిరినాయనింగారి ప్రేరణమున రామాయణారణ్యకాండశేషమును బూరించి నాఁడు. వేదగిరి నాయనింగారు శ్రీనాథున కించుక పూర్వులు. నందిమల్లయ్య ఘంటసింగయలు శ్రీనాథున కించుక తర్వాతి వారు. వీరుగాక భైచరాజు, వేంకటనాథకవి, దూబగుంట నారాయణకవి, తాతంభట్టు, హరిభట్టు, మొదలగువారు (అంధ్రభాగవతమందలి లుప్తభాగములను బూరించినవారు)అయ్యంకి మాడయప్రభృతులుగూడ శ్రీనాథున కించుక తర్వాతి కాలమందున్నవారే యగుదురు. మల్లినాథాదులగు సంస్కృతకవులు శ్రీనాథుని సమకాలమువారగుట యిదివఱకే నిరూపింపఁబడెను.

## పరిసమాప్తి.

శ్రీనాథకవిసార్వభౌముఁడంధ్రలోకమునఁ జిరప్రతిష్ఠ గడించినవాఁడు. శృంగారనైషధాది గ్రంథము లెందాఁక లోకమున వ్యాపించుచుండునో యందాఁక నాకవీశ్వరుఁడవినశ్వరమగు ప్రతిష్ఠనందియే యుండును. ఆయనగ్రంథములే

యాయన స్మారకచిహ్నములు. కాని చారిత్రికముగా నాకవీ శ్వరుఁడు జన్మించినపట్టును, గవితావైభవముఁ గన్పఱచిన పట్టును మనకిప్పుడు తెలియవచ్చినవి. కావున శాశ్వతనిర్మాణ మొకటి యాస్థలములం దెందే నొకచోట వెలయించి యప్పు డప్పు డాయనవాఙ్మయమూర్తి నారాధించుచుండుట మనకా వశ్యకకార్యమని నేను దలంచుచున్నాఁడను. జన్మదేశము కృష్ణామండలమును, బ్రధానముగా విద్యావిలాసములను వెల యించినదేశము గుంటూరుమండలమును నగుటచే మచిలీపట్ట ణమునఁగాని, గుంటూరనుగాని యట్టిప్రతిష్ఠాపనమును నెల కొల్పుట యుక్తముగానుండును. శ్రీనాథుని జన్మగ్రామము కాళ్ళిపట్టణమయినను గలపటమయినను మచిలీపట్టణమునకు మిక్కిలి చేరువనే యున్నవి. విద్యావిలాసములు చూపిన కొండ వీడుగూడ గుంటూరికిఁ జేరికగలిగియున్నది. అచ్చటి యాంధ్ర భాషాభిమానుల యాలోచనమున కిది వచ్చుఁగాకయని కోరు చున్నాఁడను.

ఇప్పటికి నా కుపలబ్ధములయిన చరిత్రసాధనములఁబట్టి శక్యమయినంతవఱకు శ్రీనాథకవిసార్వభౌముని జీవితవిష యమును విస్తరించి ప్రస్తుతింపఁగలిగితి ననుకొనుచున్నాఁడను.

కాని యింకను నాకిప్పటికి గోచరింపని ప్రధానవిషయము లెన్నియున్నవో! ఉపలబ్ధవిషయములనుగూడ నపరిజ్ఞానముచే నెన్నింటి నన్యథాకరించితినో! కొంక నేల? కోవిదులున్నారు గదా సరిపఱుపఁగలరని సంతోషించుచున్నాఁడను.

సమాప్తము.

# శృంగార శ్రీనాథము.

## అనుబంధము.

### శ్రీరామాభిషేకపద్యములు.

ఉ. ఆమునినాథువంశకలశాంబుధిపూర్ణసుధాకరుల్ గుణ
స్తోములు సత్యసంధు లతిశోభితచిత్తు లుదారులున్ మహో
ద్దాములు పుట్టి రందు నొకధన్యునివంశములోన నొక్కఁడున్
బ్రేమతొ కొండవీట నరిభీషణుఁడై తనరారుచుండియున్.

శా. పాథోరాశిగభీరుఁ డుజ్జ్వలకళాపారీణుఁడైనట్టి శ్రీ
నాథుండన్న కవీశ్వరోత్తమసుతన్ నందంబుగాఁ బెండ్లియై
సాధుస్తోత్రగులైన సూనులను భాస్వత్తేజులంగాంచె భూ
నాథుల్ మెచ్చఁ బ్రపంచశాలులను సన్మార్గక్రియాలోలురన్.

క. వారల మాతామహుఁ డతికూరిమితో నింటనుంచుకొని పెంచుటచే
నారూఢిగ శ్రీనాథునివారై వర్తిల్లిరాగిని వసుధాస్థలిలోన్.

క. వారలవంశపరంపర లారూఢిగ విస్తరించె నతివిభవమునన్
వారిలొ మాధవమంత్రియు ధారుణిలోఁ బొగడుగనియె ధన్యత మెఱయన్.

ఈ మాధవమంత్రి కైదవతరమువాఁడు శ్రీరామాభిషేకకర్త.

### వెలుగోటివారి వంశచరిత్ర.

ఉ. దన్నదకోటముందర మదగ్రబలోన్నతి గంగదాఁటి సం । పన్న
బలుండు సింగజనపాలునిమాదఁడు రెడ్డిపోతనిన్ । బన్నినసేనలం దునిమి పా
ఱఁగఁద్రోలె విరాటుపీట న। త్యున్నతవిక్రమంబున సుయోధనుఁద్రోలు కిరీటి
కైవడిన్.........మ. ఘనశౌర్యుండగు మాధవాధిపునిధాకన్ భీతిఁ బ్ర

భ్రష్టసా। ధనుఁడై దన్నడకోటవద్ద నఃపోతారెడ్డి మానంబు సి। గ్గను బో నాడి రయంబునం బరవ నాక్షోణీస్థలిఁ జూడ నేఁ। డును ఃచొప్పడి యాఃపై కసవుపాటుఁ లేదు త్రోవాటచేఁ.........దన్నాఁకోటకడ రెండుమార్లు రెడ్డివారినిగెలిచి జగనొబ్బగండ, సంగ్రామధనంజయ, రాజవేశ్యాభుజంగ బిరుదు దెచ్చినవారు రావు అనపోతా నేడున్ను మాదా నేడున్ను రాజుకొండ, దేవరకొండ రెండుపురంబులు పంచుకొని రాజుకొండ అనపోతా నేడు, దేవరకొండ మాదా నేడు వుంచుకొనిరి. ఆమాదానేని కొమారుడు పెదవేదగిరినేడే వేములకొండకడ సత్యాగదేవుని చాళుక్యదేవుని కన్నడదేవుని కంకాళదేవుని ఉదయనదేవుఁ గొట్టి వేములకొండ రణరంగస్థల వైరిరాజజీమూతపవన ఏకశిలానగరసమీపక్షాత్రవరాజన్యదహనదావానల బెండపూడివిభాళబిరుదు వహించినవాడు రావు పెదవేదగిరినేడు. ఆ పెదవేదగిరినేనికి రామచంద్రుడున్ను కుమారమాదానేడు వుట్టిరి.........ఆమాదానేనికి పినవేదగిరినేడు లింగమనేడు పుట్టిరందగ్రజుండు.........ఉ। వేమనతోడఁబుట్టువట వింతలు నేఁడదిగాక మానెబో। కోమటివానిబిడ్డఁడట గోళకుఁడుఁ గృషిసేయువాఁడెకఁ। భూమిఁ గుమారవేదగిరిపుణ్యపరుండవు నీసమక్షమం। దేమని చెప్పవచ్చు గుణహీనునిఁ గోమటిరెడ్డిమాచనిఁ — ఆకొమారవేదగిరినేడే అనవేమారెడ్డితమ్ముని మాచారెడ్డిని గొట్టి తమ్మపడిగానంబొదిగించిన యీఅనవేమారెడ్డి పినవేదగిరినేన్ని జంపి తమ్మపడిగానబొదిగించి సింహతలాటబిరుదున్ను బుచ్చుకొనియుండిన వేదగిరినేనితమ్ముడు లింగమనేడే ద్వాదశవర్షంబులవాఁడైయుండి తనబంధువర్గంబుల హితపరిజనంబులఁగూర్చుక అమరులకు వెక్కసంబగు యుద్ధంబుచేసి అనవేమారెడ్డిని గొట్టి తమ్మపడిగానబొదిగించి సింహతలాటబిరుదును తనచేత శ్రీనాథుండడిగి కొంచుబోయిన సంగికంతపోతరాజనే కర్తాకిని బుచ్చుకొనెను. అంతకుముందే అనవేమారెడ్డికి పెద్దలు పెదవేదగిరినేన్ని తమ్మపడిగాన బెట్టవద్దని బుద్ధిక్రమంబుగా జెప్పిన విధం బెట్టనిన — ( పెదకోమటి వేమారెడ్డియని యుండవలసియుండగా నిందుఁ దప్పుగా ననవేమారెడ్డియనికలదు.)

సీ. దన్నాలకోటొద్ద సన్నపోతారెడ్డి తావిరుగుతలంపుతలఁపవైతి
సింగయమాధవుఁజీరిన యనవేమఁ డోడిపాటుకొంత మాడవైతి
కొమరగిరెడ్డికి కోరిసింగయమాదు తనరబెట్టినబొమ్మ తలఁపవైతి
సురధాను మన్నన మాచుకొంటివిగాని వారితోఁదొరయుట వలవదనవు

గీ. అనుపమంబుగఁ గొమరవేదాద్రి నిట్లు | ఘనతరంబుగఁదమ్మపద్గమునఁబెట్టి
యొరుల బుద్ధులు వినియిటుదొరలఁబడియు| విన్నబడితివి పెదకోమటన్న వేమ!

ఈలింగమనేనిచేత శ్రీనాథుఁడు సఁదికొంతపోతరాజనేకగానిని కొంచు పోయినపద్యము:—జగనొబ్బగండాంక—ఇదియుదాహృతమే. ఆలింగమనేడే సోమకులము రాజులు మొదలయిన రాచవారినెల్లఁగొట్టి కాలిపెండాన పొదిగించెను. ఆనవేమారెడ్డి మొదలయినవారినెల్లఁ గొట్టి తమ్మపడిగాన బొదిగిన పంటరెడ్లున్ను తమలోతమరు భాషించుచున్న విధంబెట్టిదనిన:—

శా. శ్రీలాలిత్యుఁడు రావులింగనృపతి శ్రీపాదపద్మంబునన్
వేలేరాజులు కొండరళ్ళయనుతున్ వీరాంకుఁజూపింత్రు వీ
డేలాకంపమునొందె క్షితి, నదిగా దీకాపుజాణండు దాఁ
గాలాంజాదుల తమ్మమెక్కినణమున్ గర్వావరమన్నెక్కినన్.

ఉ. అంచతరాయరావు బిరుదాంకము రాజుల గొట్టియందె గీ
లించిన మాదభూవిభుని లింగనృపాలున కొప్పుగాక గ
ర్వించిన నీవుఁజొప్పడుచె వేమరు నల్లయవేమరెడ్డిపో
కొంచెపు దమ్మదిండితిను గూళకు నింపాతలాటమేటికిన్?

ఉ. ఆజిముఖాతిభీకులగు నల్లయవేమనవీరభద్రుఁడున్
రాజకులాభిరామ రణరాఘవలింగనృపాల నీమహా
రాజితపాత్రతిమ్మదిని రాజ్యమునిల్పిరి యింకగ్యేమునన్
రాజను హోఁబ్రదుర్గముల రాజులు గ్గకొనకుండ జూతురే?

ఉ. వాదులు వాదవిద్యల సువర్ణముగాంచుట యద్భుతంబె యీ
మాదయలింగశౌరి గరిమంబుగ నల్లయ వీరభద్రుడున్
వాదముచేసి దేహము సువర్ణమయంబుగ వానియందియుఁ
ఖేదముదక్కయుండ్రి దలక్రిందయి వ్రేలుచు విఱ్ఱవీగుచున్.

ఆపినసింగమనేనివంశావతారంబెట్టిదనిన: సీ. వీరాగ్రగణ్యుండు వెన్న భూపాలుండు ఖ్యాతి నేరాజుముత్తాతతాత—ఈపద్యమిత్యవలి నుదాహృతమే—ఉ. మేదిని రాయరావనెడు మేటిమహాబిరుదప్రతాప సంపాదన మన్నపోతజనపాలుఁడు జేసినఁజెల్లుగాక యీ। పాదరిమన్నెబందలక పాత్రిపురాజుల కేలగల్గునే। ఆదటఁ దాండవంబు శివుఁడాడిన జోగులకాడఁ జెల్లునే?

సీ. ఛప్పన్నరాజన్య సంగరస్థలిలోన వాఁడెరాజని కానవచ్చు నిన్ను
బిరుదునూపురరాజ భీకరస్థలిలోన వాఁడెరాజని కానవచ్చు నిన్ను
పరభేదనాటోపపట్టభద్రులలోన వాఁడెరాజని కానవచ్చు నిన్ను
సర్వ సర్వంసహాచక్రవర్తులలోనె వాఁడెరాజని కానవచ్చు నిన్ను
గీ. చండభుజదండఖండితసకలవైరి। మండలేశ్వరనుతకీర్తి పుండరీక
పరిమళాపూర్ణదిగ్దంతిబలవిహార। అహితనిర్ఘాత రాయరావన్నపోత!

క. ఒక మితుకున నొకనాఁకలి। ప్రకటితముగ దీర్చరాదు పదివేవుర నీ
వొక మెతుకున రక్షింతువు। అకలంకా రాయరావు అనపోతాంకా!

క. పమ్మెటసోముని రేపలి। తిమ్మని నల కొండవీటి దిక్కున మెరయం
దమ్మెటము వేసి గెలిచితి। వమ్మకొ రాయరావు అనపోతాంకా!

ఆయనపోతమనేనికి సర్వజ్ఞసింగమనేడున్నూ వసంతరాయడు పుట్టిరందగ్రజుండు:

సీ. సకలవిద్యాభ్యాస సాహసగరిమంబు నూటిమీఱగ దోడు చూపినాఁడు.........ఇత్యాదిపద్య ముదాహృతమే. సీ. గాధేయుదానంబు

ప్రాభవం బంటిమా (వూటలోదాటలోవు?) రాదు। సురభూజములవార్త
సొబగుపొమ్ముంటిమా యెండునో పండునో యెఱుఁగరాదు। జలజంబు
చాగంబు చర్చింతమంటిమా మెఱమునో వఱచునో మెచ్చరాదు। కామధేనువు
నీవి గణుతింతమంటిమా కట్టునో పట్టునో కానరాదు। తోలుచూపక
యడిపోక తూలిపోక। కొమ్ము గ్రుచ్చక కయికొండు కోర్కులనుచు। ప్రధన
విజయుండు ఖడ్గనారాయణుండు। ఇచ్చు కవులకు శింగభూమీశ్వరుండు.
శ్రీనాథుఁడు సర్వజ్ఞుని సముఖానకుపోతూ శారదాంబకు ప్రార్థనచేసిన
పద్యం:—సీ. దీనారటంకాల—ఇత్యాదిపద్య ముదాహృతమే. సీ. ఏమిచ్చె
రావోరి యెమ్ములిచ్చె దధీచి యెమ్ము లర్థులకు దా సొమ్ములగునె। మహిమచే
సెదవోరి మాంసమిచ్చెను శిబి కండలర్థులకు బంగారమగునె। జీమూతవాహ
నుం డేమిచ్చెరా వోరి యడిగిన ప్రాణముల్ విడిచెనపుడు। కర్ణుని తేగంబు
వర్ణించెదవు భట్ట చర్మమర్థికి పట్టుసాలువగునె। గీ. పూని కలిఁ జెప్పఁ జూపఁగా
రాని యీవు। లెన్నఁడో నాఁటి వార్త లిఁకేమిచెప్ప। ప్రధనవిజయుండు
ఖడ్గనారాయణుండు। ఇచ్చు కవులకు సింగభూమీశ్వరుండు. సర్వజ్ఞసింగ
మనేఁడు శ్రీనాథునకు సమస్యయిచ్చిన పద్యము:—'తక్కకరావుసింగ'
ఇత్యాదిపద్య ముదాహృతమే. ఉ. ఇమ్మహి రావుసింగమనుజేంద్రు వసం
తుని యీవులెన్నుచో। గమ్మ దధీచిభానుసుతకల్పక మేఘులఁ జెప్ప నేలయా।
బొమ్మిక వెట్టులాటలును బూని కలాసపు ముత్తులాటలున్। దుమ్ముల చల్లు
లాటలును తూకొని నీళ్ళుల చల్లులాటలున్. అనెని యనుజుండు: క. భట్టనగ
రుదరిరూపము। భట్టనగా రాచవేల్పు పాటించని యా।తొట్టిరిరాజులకబ్బునె।
రట్టడిసత్కీర్తికాంత రావువసంతా! చ. నడపడిచక్కగాద యొకనాఁడును
వుక్కిటిచేడు మాన దేర్పడ విన జెప్పలేదు, పెనుబండువునందును గాలిదారివు
నీ। బడుగని నేలపొంద నని పాసివెసన్ జనుదెంచికాదె యీ। వుసమివరించె
వేడ్కనృపపుంగవురావువసంతరాయనిన్.

## శ్రీనాథుని గ్రంథముల కాలనిర్ణయము

అను వ్యాసమునుండి.—(ఇది గ్రంథాలయసర్వస్వమున గలదు. శ్రీ. కో. వెం. లక్ష్మణరావుగారిచే రచింపఁబడినది.)

"పైని చెప్పినదంతయు హరవిలాసముయొక్క నిర్మాణకాలమునుబట్టి చేయఁబడిన యూహ. కాని హరవిలాసము కుమారగిరిరెడ్డికాలమునందు రచింపఁబడలేదనియు, శ్రీనాథుని చరమదశయందు వ్రాయఁబడియెననియుఁ జెప్పు పూర్వపక్షమొకటికలదు. ఇదివఱకు శ్రీనాథునిగుఱించి వ్రాసిన వారందరును ఇట్లే వ్రాసినారు. కాని ఇందుకు వారు కారణములను ఇచ్చియుండలేదు. మన మాకారణములను ఊహించి నివారింపవచ్చును. హరవిలాసము చివరగ్రంథమగు నెంచుటకును 1400 లో రచింపఁబడినది కాదనుటకును హరవిలాసగ్రంథమునందు నేవిధమైన యాధారమును కానఁబడదు. అది కుమారగిరియొక్క పెద్దసెట్టికి నంకితము చేయఁబడినది. కావున నది కుమారగిరికాలమునందే రచింపఁబడె ననుకొనుట స్వాభావికము. కుమారగిరి చనిపోయినతరువాత 30 సంవత్సరములకో 40 సంవత్సరములకో వ్రాయబడిన దనుకొనుట యస్వాభావికము. ఇదియుఁగాక యీగ్రంథమునందు, కృతిపతిని అతనిబంధువులను గుఱించి వ్రాసిన యీక్రింది గద్యపద్యములవలన కుమారగిరిసేవలో వీరుండగ నీగ్రంథమును వ్రాసినట్లు మన మూహింపవలయును. కాని, కుమారగిరి చచ్చిపోయినతరువాత నలుబది యేండ్లకు వెనుకటి సంగతులు జ్ఞాపకము తెచ్చుకొని వ్రాసెననుట పొసఁగనేరదు............ 'కోమటిగిరి నృపాలుని వలన నాందోళికాచ్ఛత్రచామరతురంగాది రాజ్యచిహ్నములు నడపి యమ్మహారాజునకుఁ బ్రతిసంవత్సరోత్సవంబునకుఁ దగిన...... సుగంధద్రవ్యంబు లొడఁగూర్చియుఁ జీనిసింహళతవాయి హురుముంజిజలనొూగి ప్రభృతి నానాద్వీపనగరాకరంబులగు ఘన............ గాణిక్యంబులు తెప్పించియు.........సహాచామండును నని విఖ్యాతిగాంచిన యవచి దేవయ తిప్పప్రభుం డేకొక్క నాఁ డాస్థానమండపంబున సుఖోపవిష్టుండై:'

మ. ఖుసిమాఁరఁ సురఁథాణి నిండుకొలువుసైకూర్చున్నచో నీకరా । ఘ్యసకంబు నుతియించురా యవచితిప్పా..., చ. కుమారగిర్యధీశ్వరుని వసంతవైభవముసర్వము నొక్కఁడ నిర్వహించుచుఁ. కోమటిగిరిరాజ దేవేంద్రకూర్మిహితుడు. క. కోమటిగిరి వసంతన్పృపా।గమకవివరిగంధసార కస్తూరీ కుం।కుమకర్పూరహిమాంభ।స్సముదంచితబహుసుగంధి శాలాధ్యక్షా! ఇట్లుహారవిలాసము వ్రాయుచున్నాఁడు, కుమారగిరి బ్రతికియుండెననియు, కొండవీటిలో రాజ్యము చేయుచుండెననియు అతనియొద్ద పెద్ద సెట్టిగా అవచి తిప్పయ యుండెననియు జూపువాక్యము శ్రీగ్రంథమునందుఁ జెక్కు లుగలవు. ఇట్టివాక్యములున్నను, కుమారగిరి చనిపోయినతరువాత తిప్పనఅధికార మూడిపోయినపిదప, హరిహర పేరోజు శాహాలు కీర్తిశేషులైన యెన్నియో వత్సరములకుఁదరువాత నీకావ్యము రచింపఁబడియెనని చెప్పుటకంటె విపరీతమైన సిద్ధాంతము మఱియొకటి యుండదు. ఇది కుమారగిరిరెడ్డికాలమున రచింపఁబడలేదని చెప్పవలెడల నైషధము పెదకోమటి వేమారెడ్డికాలమున వ్రాయలేదనియు, భీమఖండము అల్లాడవేమవీరభద్రులు బ్రతికియుండఁగఁ జెప్పఁబడలేదనియు, నొప్పుకొనవలసివచ్చి విపరీతసిద్ధాంతపరంపరను ప్రారంభించును..."

శాసనములు.

లోకల్ II వాల్యూం...పెద్దాపురంతాలూకా...కిమ్మూరులో తిరుపతి అనే గ్రామములోనున్న శృంగారవల్లభరాయని ఆలయములో...8 నెం. దీనికి ఉత్తరంపువైపుననున్న స్తంభంమీఁది శాసనము:

శ్రీశకవరుషంబులు ౧330 అగు నేటి సర్వధారి సంవత్సర మార్గశిరశు ౧ సోమవారము కోమరగిరిపురం శృంగారరాయనికి ముక్కంటిరాజుగారు కాటమరెడ్డి వేమారెడ్డింగారిదేవులు అయి తమతోబుట్టువులయిన మల్లసానమ్మగారికిన్ని తమతండ్రి కన్నిభరాజుగారికిన్ని సుకృతముగాను నగరికి కాలోచిత

మూల్యము సమర్పించి పెట్టించిన బృందావనము సేసినవారికి క్షేత్రము ఖ ౨.
ఈకైంకర్యము శృంగారరాయఁడు ఆచంద్రార్కముగాను అవధరించువారు.

లోకల్ II వాల్యూం 217 పేజి (చాళుక్యభీమవరంలో) దీనికి ఉత్తరంవైపున రెండో స్తంభంమీఁదవున్న శాసనః

స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౩౫౬ అగు నేటి ఆనందసం॥ పుష్య బ ౧౩ బుధవారము ఉత్తరాయణ మకరసంక్రాంతి పుణ్యకాలమందు శ్రీమత్కుమారారామచాళుక్యభీమేశ్వర శ్రీమన్మహాదేవరలకు అల్లాడభూపాలుని కుమారుడు వేమారెడ్డిగారి దేవులు జయమల్లసానమ్మ తమకు నక్షయమానట్టుగాను వీరారెడ్డింగారి అనతిక్రమానను కుమారారామచాళుక్యభీమేశ్వరస్థానసమ్మతిని భీమవరము వుత్తరసమీపానను కుమారీనది పశ్చిమదరిని నానాతోయాలపుష్పాల ఫలవృక్షాలతోటపట్టు........సర్వకరపరిహారముగాను ఆచంద్రార్కస్థాయిగాను భీమేశ్వరదేవరకు జయమల్లసానమ్మ సమర్పించెను.

లోకల్ II వాల్యూం (125 పేజి) దాక్షారామంలో తూర్పుస్తంభం పైనున్న శాసనం:

సప్తాకాటయశో రేః—ఇటువంటి కాటమరెడ్డి వేమారెడ్డింగారికి నిజభృత్యుడైన కడియంమాచినేనింగారు తనకు స్వామియయిన కాటమరెడ్డి వేమారెడ్డిగారికొమారుడు కొమరగిరిరెడ్డిగారికిన్ని వారిదేవులకున్ను అక్షయమను కృతమూనట్టుగాను దాక్షారామ శ్రీభీమేశ్వర శ్రీమహాదేవరకు ఆస్థానశిలా మండపము కట్టించి సమర్పణచేసెను. స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౩౩౬ అగు నేటి జయసంవత్సర కార్తిక శు ౧౫ భానువారం.

లోకల్ II వాల్యూం161 పేజి:

అనపోతప్రభోః పత్నీ సపత్నీ ధరణీశ్రియోః । అనేకసుగుణైశ్వర్యాస్థైర్యరంబికా మనుమాంబికా—కుమారగిరిభూపాలరత్నాకరసుధాకరః । అనపోత

కుమారేంద్రో లోకానందాయవర్ధతే। శ్రీమత్కుమారగిరిభూమిపతేః కుమారో వీరాన్నపోతన్నపతిః — ఈమీదరాయి పగిలిపోయినది.

II [స్వస్తిశ్రీ జ] యాభ్యుదయశాలి (వా) (2) (హన)శకవరుషంబులు ౧ (4652) అగు నేంటి శోభకృత్సంవత్సర ఆ (శ్వీ) జ బ ౧౦ బు నూంతు (5) ల (పాటి)కేశవనాథనికిన్ని రఘు(6)నాథనికిన్ని శ్రీమన్ మహామండ (7) (లేశ్వ)ర ధరణీవరాహమేది (8) నీ మీసరగండకఠారి సాళ్వస (9) ంబురాయని తెలుంగురాయని తిరుమలయ్యదేవ (11) (మహా) రాజులుంగారు దండం (12) సమర్పించియిచ్చిన భూదానధర్మశాసనము. తిమ్మరుసయ్యవారు మానాయంకరానకు పాలించి యీ అవధరించిన వినికొండసీమలోని నూంతులపాడు అని గ్రామానను, ఈరెండు దేవళ్ళఅమృతపళ్ళకున్ను అంగరంగవైభవాలకును సమర్పించి......ఇత్యాది — ఈపుణ్యము రాజులుంగారికి విన్నపముచేసి యీడేర్చినవాండు పొన్నమరాజులుంగారు.

III స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౬౫ అగు నేంటి శోభకృత్ సంవత్సర ఆశ్వీజ బ ౧౦ బు నూంతులపాటి ఛాయామల్లిఖార్జునికిన్ని, వీరేశ్వరునికిన్ని శ్రీమహామండలేశ్వర ధరణీవరాహమేదినీమీసరగండకఠారి సాళువసంబురాయని తెలుంగురాయని తిరుమలయదేవమహారాజులుంగారు దండం సమర్పించి యిచ్చిన భూదానధర్మశాసనము. తిమ్మరుసయ్యవారు మానాయంకరానకు పాలించి యీ అవధరించిన వినికొండసీమలోని నూంతులపాడు అని గ్రామానను యీరెండుదేవళ్ల అమృతపళ్లకున్ను అంగరంగ వైభవాలకున్ను సమర్పించి యిచ్చినభూమి......ఈపుణ్యం రాజులుంగారికి విన్నపముచేసి యీడేర్చినవాండు పొన్నమరాజులుంగారు.

IV స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౩౬౪ అగు నేంటి దుందుభిసంవత్సర వైశాఖ శు ౧౫ గు శ్రీమన్మహామండలేశ్వర మీసరగండకఠారి సాళువ తెలుంగురాయ దేవరాయలింగారి నూంతులపాటి అధికారి పోలమరాజు

తిరుపరాజుంగారు నూతులపాటను పూనూరిసందుకట్టునను రాజుంగార్రి ధర్మంగా ప్రజలధర్మంగా ఆచంద్రార్కస్థాయిగాను చెలువుకట్టించి ప్రతిష్ఠ చేసిరి. మంగళమహాశ్రీంజేయు.

## సింహాచలంమీద దేవాలయందగ్గఱ హంసమూల పెద్దశాసనం దిగువది:

స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౩౫౦ అగు నేంటి ప్లవ సం॥ర ఫాల్గున కృష్ణ 3 గురువారానను కనడదేశమందుల సంబురాయనికొడ్కు తెలుంగురాయండు తనకు అభీష్టార్థసిద్ధిగాను శ్రీ నరసింగనాథునికి నిత్యమును సన్నిధిని వెలుంగను అఖండదీపాలు రెండు సమర్పించెను. ఇందుకై వడ్డాదిదేశమందు ప్రాంత విటు గొల్లగార నరసబోయండు పల్లయబ్బబోయండును ఈ ..రు వసానను మోదాలు ౧౦౦ పెట్టిరి—ఇత్యాది.

## బజ్జేపల్లిలో చావలి వెంకటేశ్వర్లుగారియొద్దనున్న తామ్రశాసనము నకలు (వారిదగ్గర దీనిమూలము చూచి నేను వ్రాసికొన్నాను.):

1 కళ్యాణం జగతాం, 2 లీలామ్యాకజితాం, 3 పమోహారేతాం, 4 భవతుభవతాం ఫలాప్త్యై, 5 యన్మాళా, 6 విష్ణోఃపాదాదుదీర్ణేసురసరిత ఇవ స్రోతసి స్వచ్ఛవృత్తౌ వర్ణేజాతస్సుజన్మా శరవణభవవచ్ఛక్తిమాక్ప్రోలభూపః । తస్మాన్మాచక్షితేంద్రో జనివహతిభువం యద్భుజేయచ్చరిత్ర శ్లాఘామాత్రే ముఖానాం వహతిదశశతీం వ్యాపృతాం భోగిరాజః॥ 7 తస్యాసీ దనుజో హరేరివ హరి ర్నిస్సీమవిశ్వంభరా। దానాధఃకృతభర్గ (నూను) విజయీ వేమక్షమావల్లభః । యేనశ్రీగిరిసానుసీమ్ని విహితా పాతాళగంగాజుషాం సోపానావళి రూర్జితాతనుభృతాం స్వర్గాప్తినిశ్రేణికా ॥ 8 మాంపక్షోణిపతిః, 9 వేమాంఖిపో 10 తస్యానుజో వేమున్నృప

స్య మాచక్షితీశ్వరో లబ్ధమహీవిభాగః। శ్రీకొండపల్లీం నిజరాజధానీం కృ
త్వాసుఖీ దీవ్యతి ధర్మధుర్యః, 11 కులమివవిమలం యశోయదీయం త్రిజ
గతివేష ఇవోజ్జ్వలః ప్రతాపః । వితరణమివచశుభ్రితం విశాలం భసతిచ వాక్య
మివోర్జితం చరిత్రం । 12 జ్ఞాతాయది నహి దాతా దాతాచే త్కో_పి భువి నచ
జ్ఞాతా, జ్ఞాతా దాతాచభవ౯ పెదకోమటి మాచభూపతిర్జయతి. 13 సహ
ర్వాం పాలయ న్నుర్వీ ముర్వీశకులశేఖరః।యందత్తవా న్నగ్రహారం తద్దానప్రక్రి
యోచ్య తే।శాకాబ్దే రసరామరామవసుధా సంఖ్యే జయే వత్సరే।మార్గేకృష్ణ
బుధాన్విత ప్రతిపది ప్రాప్తే రవౌ కార్ముకం। స్వర్గాప్త్యై పెదకోమటిక్షితిప తేః
శ్రీబల్యపల్లీపురం। ప్రాదాత్సూర్య_య పోతనాఖ్యవిదుషే మల్లేశ్వరస్యాంతికే।
అకలంక సకలభాషా కవితామూర్ధాభిషిక్తాయ, విద్వన్నిరూఢ రాజాస్థానసుధాం
భోధి పూర్ణచంద్రమసే, గద్యశ్రీబాణకవేః పద్యేపి తద్వైవ కాళిదాసకవేః, తూ
ర్య_య బన్నయ సుధియః పౌత్రాయ యజుర్విధిజ్ఞాయ। ఉజ్జ్వలతరాష్ట్రభాషా
కవితాసామ్రాజ్యపట్టబంధస్య, పుత్రాయాన్నయ సుకవేః శ్రీభారద్వాజగో
త్రాయ, అనుజేన పాణిబదరీకృత పాణినిసణిత ఫణితిమార్గేణ, త్రిపురాం
సుకవిమణినా సంస్మరయిత్రే సలక్ష్మణం రామం పాట్టుమి శ్రీకంఠగురోః
పంచాక్షరమంత్ర పౌనరుక్తస్య, శిష్యాయ శిష్యపరిషద్రగ్నా దాక్షిణ్యసత్క_
టాక్షస్య, దత్వాగ్రహారం వెల్నాండో సామ్రాజ్యైశ్వర్యం నృపాలకః తస్య
శ్రీపెదకోమటి పురసంజ్ఞా మకల్పయత్. లబ్ధ్వా స పోతనార్యోపి గ్రామం
శ్రీమాచభూవరాత్। శ్రీకృష్ణాప్రుప డున్మేష ముషితాశేషకల్మషం। పంచా
శీత్యంశరూపేణ విభజ్యాస్మి న్నదాత్సు_తీ। తృతీయాంశం పితృప్రీత్యై విద్వ
ద్బాంధవరాజయే। సీమాచిహ్నాని దేశభాషయా లిఖ్యంతే..............
..................స్వదత్తా మిత్యాది॥ విద్యానాభ్రవయ నారణ్ణనామా
శ్రీమాచ భూపతేః। అకరోద్వాచసాంభూమిః నిర్మలం ధర్మశాసనం। శ్రీజగ
నొబ్బగండస్య.

## లోకల్ 48 వాల్యూం చెఱకుమిల్లిలో దొరకిన తామ్రశాసనము:

ఈశాసనము మీఁదిశాసనమందు దాతయయిన పెదకోమటి మాచారెడ్డి కుమారుఁడగు తిప్పయరెడ్డిది. ఇది పెద్దశాసనము. దీనినుండి యించుకంత యుదాహరించుచున్నాను:

శాకాబ్దే గిరిరామవిశ్వగణితే. భాద్రే గురౌ మాన్మథే|కృష్ణాయాం ప్రతి నేగణాధిపచతుర్థ్యా మేకమూరుం పురం| మాచాఖ్యాం విదితాష్టభోగమతులం శ్రీతిప్పభూపాలకః| ప్రాదాద్దెబ్బయ బుక్క (బంక?) మల్లపమహామాత్యాయ నిత్యాదరాత్ ........మలాపహారిణీ భీమరథ్యంతర్వేదిసంస్థితమ్| భోగైశ్వర్యాష్టసంయుక్త మేకమూరుం పురోత్తమమ్| ప్రతాపరుద్రదేవస్య భాండాగారాధిపస్యచ| యఱ్ఱమామల్లనార్యస్య పౌత్త్రాయ గుణశాలినే| యఱ్ఱయామాత్యచంద్రస్య సూనవే నయశాలినే|శ్రీపరాశరగోత్రాయ యజుశ్శాఖాయ ధీమతే| బంకమల్లాఖ్య విప్రాయ దేవార్చనపరాయచ| ఆచంద్రతారకం ప్రాదాత్ శ్రీమాన్ తిప్పమహేశ్వరః..........పెదకోమటి మాచేంద్ర సూనో స్తిప్పమహీపతేః | విద్యానరహరిస్స్వస్తు(?) మకరో ద్ధర్మశాసనం| శారీమాత్రక్షేత్రం శాసనం భావనార్థమేకాంశం| భావయ నరహరివిదుషే ప్రాదా చ్ఛ్రీబంకమల్లయామాత్యః.

## కల్వపాముల శాసనము.

1. శ్రీనాథస్య వరాహదివ్యవపుషో వః పాతు దంష్ట్రా చిరం
స్ఫ్యాతోన్నీతమహీతలోపరితటీ నిర్యాతి శృంగాంకురా
యామాత్మీయ జలోదితాం శశికలా మాశంక్యజాతక్షణం
సౌహార్దేన విజృంభమాణ సలిలారంభో మహాంభోనిధిః.

2 లీలాద్యూతజితాం 3 భవతుభవతాం 4 తమోహారేతాం 5 యన్నో

శ్లో 6 తస్మాదభూత్ ప్రోలయవేమనామా 7 వేమక్షితీశో వృషమేకపాదం 8 మాచక్షోణిపతిః 9 వేమాధిపో మాచవిభుశ్చ 10 చూడామణిః క్ష్మాపాణాం 11 అభిమన్యుకరగ్రాహ్యా 12 సోయం వేమమహీపాలః 13 శాకాబ్దే రసనేత్రాగ్ని చంద్రసంఖ్యామపేయుషి। తారణేవత్సరే పౌషే రాహుగ్రస్తే దివాకరే। పితుః పితామహో యస్య బ్రహ్మవిద్యా పితామహః। ఆసీచ్ఛ్రీమేశ్వరో విద్వానగ్రణీస్సోమపాయినామ్। వషట్కృత పురోడాశే శ్రీభీమేశ్వర యజ్వని। కృష్ణవేణ్ణా తటాన్యాసన్నవాసా స్త్రీదివౌకసామ్। షట్కర్మకర్మశాలాపప్రక్రియా పరమేశ్వరః। పోతయాఖ్యో మహావిద్వా నాసీద్యస్య పితామహః। పుండరీకదృశో విద్యాఖండ చంద్రభృతోఽభిధా। గుండయార్యః పితా యస్య మండనం బ్రహ్మసంతతేః। బ్రహ్మసూర్యాదిసిద్ధాంత సింధుమంథాన కాద్రిణా। జ్యోతిషజ్యోతిషాయేన త్రైకాల్య ముపలక్షితం। తారకబ్రహ్మ తత్త్వార్థస్థాపింఛ దళమేచకం। లక్ష్మణానుచరంధామ రామాఖ్యం యస్య దైవతం। ఆహర్త్రా సప్త తంతూనాం యేన గోదావరీతటే। శూలాని పాపచోరాణాం యూపస్తంభాః ప్రతిష్ఠితాః। తస్మై హరితగోత్రాయ యజుశ్శాఖ్నాయ వేదినే। నిత్యాన్నదాన వ్రతినే శ్రీమతే పెద్దియజ్వనే। ప్రాదాత్త్రిలింగవిషయే ఖండవాటాహ్వయే స్థలే। కల్యపాములనామానం గ్రామ మాచంద్రతారకం। శ్రీరాఘవేశ్వర ప్రీత్యై ధారాపూర్వం ధరాధిపః॥ అస్యగ్రామస్యసీమాచిహ్నాని దేశభాషయా లిఖ్యంతే—కల్యపాములు వేమవరానకును మూర్వకు వంట్రప్రెగడ పొలిమేరదగ్గఱికె కుంట తూర్పుగట్టుమీందిరావి. అందుండి దక్షిణమై పోంగ జమ్మిచెట్టున్ను పుట్టను, ఆపుట్టను దక్షిణముఖమైన కునినుండి తీగెలోడు దాంటి ఆగ్నేయముఖమై పోంగాను నల్లబుట్టమీందంగాను, ఆగ్నేయూన వన్నెలుమోచె. ఆవన్నెలపడరే పడుమఱుముఖమై రాంగా నంతనుండి కునిగా నుత్తరపుముఖమై రాంగా నంతనుండి కునిగా నప్పడిన్ని పడుమటిముఖమై వచ్చి జెల్లంకుల పుట్టమోచెను. ఆపుట్టమోచే కునిగా నుత్తరముఖమై వచ్చి పంటలోడు మోచెను. దక్షిణానకు కాటూరిపొలముసందునకు ఆపంట

కోట అవలిదరి నైఋతికి కాటూరికిఁబోయీ బండిడెరువు దాంటి అకోటి అద్దరే పడుమటికి వన్నేటిమూలను కోడు ఉత్తరముఖమై దాంటి నందమూరి పొలిమేర శిలాస్తంభము—వాయవ్యానకు నాగులచింత ఉత్తరానకు కుంటాను ఇట్టిక నూయిన్ని ఈశాన్యానకు మఱ్ఱికోటి అద్దని ఒఱలనూయి, సీమలు. స్వదత్తాత్—విద్యాధికారీశ్రీనాథో వీరశ్రీవేమభూపతేః—శ్రీవీరనారాయణస్య—

## కనుకుఱ్ఱు తామ్రశాసనము.

1 కళ్యాణం జగతాం, 2 లీలాద్యూతజితాం, 3, భవతు భవతాం' 4, తమోహారేతాం 5 యస్మాళ్ఛానిహితం 6 తస్మాదభూత్ 7 వేమక్షితీశో, 8 మాచక్షోణిపతిః, 9 వేమాధిపో మాచవిభుశ్చ, 10 చూడామణిర్నృపాణాం, 11 యత్కీర్తిగాన 12 సోయంవేమమహీపాలః (ఇటుతర్వాత కొంతచాళుక్యశాసనము చేరియున్నది.) శాకాబ్దే శరనేత్రాగ్ని చంద్రసంఖ్యాముపేయుషి। తారణే వత్సరే పౌషే రాహుగ్రస్తే దివాకరే। ప్రాదాత్త్రిలింగ విషయే వెల్నాండో పుణ్యసీమని। తుంగభద్రాతరంగిణ్యాః ప్రతీరే పర్యవస్థితం। గ్రామం కనుకుఱ్ఱాఖ్యం, సాష్టభోగాష్టభూతికం............అస్యగ్రామస్య అష్టదిక్సీమా చిహ్నాని శిలాస్తంభాః। పూర్వతః తుంగభద్రా, దక్షిణతః పాటికవాగు, పశ్చిమతః తుంగభద్రా, ఉత్తరతః తుంగభద్రా—స్వదత్తా దిత్యాది—విద్యాధికారీ శ్రీనాథో వీరశ్రీ వేమభూపతేః, అకరో దాకరోవాచాం నిర్మలం ధర్మశాసనమ్.

## పొన్నుపల్లి తామ్రశాసనము.

1 కళ్యాణం జగతాం, 2 లీలాద్యూత, 3 భవతుభవతాం, 4 తమోహారేతాం, 5 యస్మాళ్ఛా, 6 తస్మాదభూత్ 7 వేమక్షితీశో 8 మాచక్షోణిపతిః, 9 వేమాధిపో, 10 చూడామణిర్నృపాణాం 11 అభిమన్యుకరగ్రాహ్యం

12, యత్కీర్తిగానసమయే—సోయం వేమమహీపాలో భూపాల
పరమేశ్వరః । భూదానవీరమూర్ధన్యో ధీరోదాత్త గుణోత్తరః।
శాకాబ్దే రసనేత్రాగ్ని చంద్రసంఖ్యా ముపేయుషి । తారణేవత్సరే పౌ
షే రాహుగ్రస్తే దివాకరే। పుణ్యాయాం కృష్ణవేణ్ణాయాం శ్రీసోమేశ్వరసన్ని
ధౌ। సమక్షమగ్రహారేభ్య స్సమాయాత ద్విజన్మనామ్। మండూకశల్యవ్యథిత
సర్వప్రాణాభిరక్షణాత్। ఆసేదుషాం పండితానాం కులేపరిహితాభిధామ్।
జాతాయాపస్తంబసూత్రేసూత్రమార్గానుసారిణి। కాశ్యపాయయజుశ్శాఖాధ్యా
యినేసుకృతాత్మనే। భూలోకధన్వంతరయే సతాంపరిహితస్యచ।పుత్రాయభాస్క
రార్యాయ పండితేంద్రాయ ధీమతే। శ్రీకొండవీటి సీమాయాం వెలనాటిస్థలే
శుభే। కృష్ణవేణ్ణా మహానద్యా దక్షిణే గోధసిస్థితమ్। పొన్నుపల్ల్యాహ్వయం
గ్రామం సర్వసస్యసమన్వితమ్। వాపికూపాది సహితం సాక్షతోదకపూర్వకమ్।
భుజ్యతాం త్వత్పుత్రపౌత్రపారంపర్యా దితి బ్రువన్। కర్మణా మనసా
వాచా ప్రాదా దాచంద్రతారకమ్. అస్యగ్రామస్య చిహ్నాని దేశభాష
యాలిఖ్యన్తే: పొన్నుపల్లి వేమవరానకు తూర్పునను మూలనూతులకుంట,
గంగులవానికుంట, వాగునడిమి కలువలవానికుంటను, గరుడనిజావ్విన్ని,
ఆగ్నేయానకు మోటవరసంది వాగున్ను, దక్షిణానకు నెమిళ్లకుంటవాగున్ను,
నక్కతిప్పలున్ను, నైఋతికి గోనెలకుంటలసందుకు వచ్చే వాగున్ను పదిరెవా
గున్ను, పడమటికి గుళ్లపల్లెచెరువున్ను మల్లమచెరువున్ను, చవటకుంటలు
రెండున్ను, వాయవ్యానకు గురువుకుంట, వుత్తరానకు కర, యీశాన్యానకు
బండ్లడొంక, మొగడొంకను రాంగాను వాగర్తను వెలగకుంటాను తొగకుం
టాను సీమాచిహ్నాలు-స్వదత్తామిత్యాది. విద్యాధికారి శ్రీనాథో వీరశ్రీవేమ
భూపతేః అకరోదాక్షరో వాచాం నిర్మలం ధర్మశాసనం॥

## పొన్నుపల్లె తామ్రశాసనము. II

1 కల్యాణం జగతాం, 2 లీలామ్యాత, 3 భవతుభవతాం, 4 తమోహ
రేతాం, 5 యన్మౌళౌ, 6 తస్మాదభూత్, 7 వేమక్షితీశో, 8 మాపక్షోణిపతిః

9 వేమాధిపో 10 చూడామణిర్నృపాణాం 11 యత్కీర్తిగానసమయే 12 సోయం వేమమహీపాలో భూపాల పరమేశ్వరః। భూదాన వీరమూర్ధన్యో ధీరోదాత్త గుణోత్తరః। ఖరామరామేందుమితే శకాబ్దే సర్వధారిణి। ఉపరక్తే సహస్రాంశౌ మాసే చాశ్వయుజాహ్వయే। నప్త్రే శ్రీపెర్యవిఙ్ఞస్య కల్యాణగుణశాలినః। అకర్తృకాణాం సాంగానామాన్యానాం వచసాం నిధేః। శ్రీభట్టభాస్కరార్యస్య పౌత్రాయబ్రహ్మవాదినః। అష్టాదశానాం విద్యానా మధ్వన్యస్య మహద్వసు। పుత్రాయవిఙ్లయార్యస్య వేద వేదాంగ వేదినః। ఆయుర్వేదంచ సాష్టాంగం నిర్నిరోధమధీయినే।। 16 ఫణిరాజ మహాభాష్య ఫక్కికాపరమేష్ఠినే। కర్మబ్రహ్మపరామర్శ మీమాంసా మాంసలాత్మనే। 17 కణభుగ్గ్రథిత గ్రంథి సింధుమంథానభూభృతే। అక్షపాదమత ప్రేక్షు పక్ష్మలీకృత చేతసే। 18 తస్మై కాశ్యపగోత్రాయ సింగనార్యాయధీమతే। శాంతాయ శివభక్తాయ యజురామ్నాయవేదినే। 19 ప్రాదాత్త్రిలింగవిషయే వేల్నాంటోద్దిపిసీమని। కృష్ణవేణ్ణాంతరంగిణ్యాః ప్రతీరే పర్యవస్థితమ్। 20 పొన్నుపల్యాహ్వాయం గ్రామం నిధానం సస్యసంపదామ్। సాష్టైశ్వర్యం సాష్టభోగం ధారాపూర్వం ధరాధిపః 21 అస్య గ్రామస్య చిహ్నాని దేశభాషయాలిఖ్యంతే... .........ఈశాన్యానకు పిన్నకుంటసీమలు- శ్రీనాథభట్టరుశాసనాచార్య దక్షిణభాగం వకటి— స్వదత్తామిత్యాది. విద్యాధికారీ శ్రీనాథో వీరశ్రీవేమ భూపతేః।।

## నందమూరు తామ్రశాసనము.

1 కల్యాణంజగతాం 2 లీలాద్యూతజితాం 3 భవతుభవతాం 4 ఉమాహరతాం 5 యస్మాశ్శానిహితం 6 తస్మాదభూత్ 7 వేమక్షితీశో 8 మాచక్షోణిపతిః 9 వేమాధిపో 10 చూడామణిర్నృపాణాం— పెదకోమటి వేమ భూపతిర్జయతి 11 సోయంవేమమహీపాలో భూపాలపరమేశ్వరః। భూదానమూనవీర్ధన్యోధీరోదాత్తగుణోత్తరః। శ్రీశాకాబ్దే రాను రామ రామచంద్రాబ్ధి

సమ్మితే| ఖరమార్గశిరోదశ్యాం సితాయాంచాపగేరవౌ, పరవాదిభసింహస్య నృసింహస్యమహాత్మనః| పౌత్రేణ వేదవేదాంగ విద్యావిద్యోతితాత్మనః సోమసుత్వాసార్వభౌమస్య శ్రీభీమేశ్వరయజ్వనః| పావనోభయవంశస్య పౌత్రాయామితతేజసః | అకర్తృకాణాం సాంగానామాధ్యానాం వచసాం నిధేః| పౌత్రాయ పోతిభట్టస్య పవిత్రాచారశాలినః| పుత్రాయగుండయార్యస్య పాండిత్యేందిరాపురోధసః| మండితస్యయశోహస్తైః శరకాండవిపాండురైః| బ్రహ్మసూర్యాదిసిద్ధాంతజ్ఞాన వైజ్ఞానికాత్మనే|శ్రీరామ మంత్రోపనిషద్విద్యావిస్ఫూర్తివేశ్మనే|నిత్యాన్నదానశౌండాయ బ్రహ్మవర్చసశాలినే| ఆస్మైహరితగోత్రాయధీమతే పెద్దియజ్వనే|ప్రాదాత్త్రిలింగవిషయే కంద్రవాటాఖ్యసీమని| శ్రీనందమూరు నామానం గ్రామం పారే మలాపహం — అస్యగ్రామస్యసీమాచిహ్నానిదేశభాషయాలిఖ్యన్తే.........విద్యాధికారీ శ్రీనాథో వీర శ్రీవేమభూపతేః| అకరోద్వాకరో వాచాం నిర్మలం ధర్మశాసనమ్|| వీరనారాయణస్య.

## ఆలపాటి వేమవరం తామ్రశాసనము.

1. కళ్యాణంజగతాం, 2. లీలాద్యూత, 3. భవతుభవతాం, 4. తమోహరేతాం, 5. యస్మాత్కౌనిహితం, 6. తస్మాదభూత్, 7. వేమక్షితీశో 8. మాచక్షోణి, 9. వేమాధిపో, 10. చూడామణిః, 11. సోయం వేమమహీపాలో, 12. శ్రీశాకాబ్దే పయోరాశి రామరామేందు సమ్మితే| నందనే మాసిమాఘాఖ్యే శివరాత్ర్యాం రవిగ్రహే| పితుః పితామహో యస్య మహానీయ యశోనిధేః| మాధవో నామ మేధావీ విశ్వవిద్యావిహారభూః| పితామహో మహావిద్వాన్ యస్య శ్రీసింగయాభిధః| వేదాదీనాం విశుద్ధానాం విద్యానాం జన్మమందిరం| శాపానుగ్రహదక్షో లక్ష్మీనరసింహమంత్రపంసిద్ధః| సకలకవిసార్వభౌమో మాధవభట్టః పితాయస్య| శ్రీవిశ్వేశ్వరవిదుషే భారద్వాజాన్వయావతంసాయ స్మయవిరహితాయ తస్మై విద్యావినయాన్వితాయ పుణ్యాయ| ప్రాదాత్త్రిలింగవిషయే కెల్నాంటి వనో

రమే । తుంగభద్రా తరంగిణ్యాః ప్రతీరే పర్యవస్థితం। ఆలపాడురితిఖ్యాతం గ్రామమాచంద్రతారకం । సాష్టైశ్వర్యం సాష్టభోగం ధారాపూర్వం ధరాధిపః । అస్యగ్రామస్య సీమాచిహ్నాని దేశభాషయాలిఖ్యన్తే......స్వదత్తాత్. విద్యాధికారి శ్రీనాథో వీరశ్రీవేమభూపతేః । అకరోద్దాకరోవాచాం నిర్మలం ధర్మశాసనమ్॥ వీరనారాయణస్య.

## రుద్రవరం తామ్రశాసనము.

1 కళ్యాణంజగతాం, 2 లీలాద్యూతజితాం, 3 మానుషాకార, 4 తమోహారేతాం, 5 యస్మాళా, 6 తస్మాదభూత్, 7 వేమక్షితీశో 8 మాచ క్షోణిపతిః, 9 చూడామణిర్నృపాణాం, 10 అభిమన్యుకరగ్రాహ్యం, 11 యత్కీర్తిగానసమయే, 12 శ్రీశైలస్థిరమూలతాం, 13 శాకాబ్దే శశివార్ధివిశ్వగణితే వర్షే వికార్యాహ్వయేమాసే మార్గశిరోభిధే గ్రహపతౌ చాపంసమాసేదుషి । సోయం విప్రగణాయ వేదవిదుషే ధారాపయఃపూర్వకం । గ్రామం రుద్రవరాహ్వయం గుణనిధి శ్రీవీరనారాయణః॥ (క్రియాపదములేదు). 14 అథాస్మిన్ వేమభూపతినా సాష్టైశ్వర్యం సాష్టభోగంచ సర్వమాన్యతయా దత్తే కోటభూమివిభూషణే రుద్రవరనామనిగ్రామే వేదశాస్త్రపారంగతాః శ్రౌతస్మార్తానుష్ఠాననిష్ఠా అనూచానసంతతయః ప్రతిగ్రహీతారో వర్ణ్యంతే 15 బ్రహ్మసూర్యాది సిద్ధాంతరహస్యార్థైకవేదినా । జ్యోతిషజ్యోతిషాయే సత్రికాల్యముపరోక్షితం, 16 సోయం పోతియభట్టస్య నప్తా గుంటయభట్టస్య పౌత్రః పెద్దియజ్వనః పుత్రః గంగాధరజ్యోతిషికాగ్రజన్మా రామచంద్రజ్యోతిషికః హారితగోత్రః త్రయస్త్రింశద్భాగః ఇత్యాది—గ్రామసీమాచిహ్నాని. స్వదత్తామిత్యాది—విద్యాధికారీ శ్రీ నాథోవీరశ్రీవేమభూపతేః.

## మూలఁగూరమ్మ కొండమీఁది శాసనము.

ఈశాసనమును అమీనాబాదుకుపోయి, నేనే పరిశీలించి వచ్చితిని. అది కొండమీద గుడికడ జారుబండపై చెక్కఁబడియున్నది. ఇరువది బంతు లున్నవి. $8\frac{1}{2}$ బంతులు స్పష్టముగా చెక్కఁబడినవి. అవి యిం దుదాహరింపఁబడిన రెండుపద్యములు. $11\frac{1}{2}$ బంతులు అక్షరములు పయిపయినిజెక్కఁబడినవి గావున కొంతకొంత చెఱిగిపోయినవి, చదువరాకున్నవి. అందు పడిదరము మూలఁగూరు పలకలూరు గ్రామముల సీమాచిహ్నాలు వ్రాయఁబడినట్లు కొంతకొంత చదువఁదగియుండుటచేఁ దెలిసికొనఁగల్గినాను. "విశ్వోత్తరుం డన్న వేమభూపాలుండు" అని స్పష్టముగా శాసనమునఁ గానవచ్చుచున్నది. ఆరెండు సీసపద్యములు నొక్కనిచేఁ జెక్కఁబడినవే. పెదకోమటి వేమారెడ్డి నాటివే. మొదటిపద్యము అనవేమారెడ్డిధర్మమును జెప్పునదే.

సీ. శాకాబ్దములు సహస్రమును నిన్నూంటతొంబదియొనిమిది యను భవ్యసంఖ్య
గలిగి యొప్పారెడు నలవత్సరంబున మాఘమాసము పూర్ణిమాదినమున
విశ్వోత్తరుం డన్న వేమభూపాలుండు తమకులస్వామిని కమ్రతకిరణ
రేఖావతంసకు శ్రీమూలఁగూరమ్మ కఖిలజగన్మాత కంగరంగ

గీ. భోగసంసిద్ధికై ధారవోసి యిచ్చె గ్రామములుమూఁడు శ్రీకోటభూమియందుఁ
బడిదరముమూలగూరంబ(న)పలకలూరు దానఖచరేంద్రుడాచంద్రతారకముగ.

సీ. శ్రీమపరిప్రాప్త సామ్రాజ్యసింహాసనాధ్యాసియై యఖిలరాజాధిరాజ
పరమేశ్వరుం డాజిపార్థుండు పెదకోమటన్న వేమాధీశుఁ డర్థిసురభి
తన కూర్మిపినతండ్రి యనవేమభూపతి చేసినపుణ్యమూర్జితముగాఁగ
నీ గ్రామములుమూఁటి కెల్లకాలంబు భోగైశ్వర్యసర్వమాన్యతల నొసఁగె

గీ॥ నంబికకు మూలఁగూరమ్మ కఖిలజనని కర్థిఁగట్టించె భువనమోహనముగాఁగ
సమధికోన్నతి నభ్రంకషంబులైన గుడియుఁబ్రాకారవలయంబుఁ గొమరు

మిగుల.

## కొండూరుశాసనము.

ఇది గొప్పతామ్రశాసనము. అముద్రితము. ఓరియంటల్ లైబ్రరిలో నున్నది. విస్తరభీతిచే సమగ్రముగా నుదాహరింపఁజాలకున్నాఁడను. శ్లో. మరీచి బ్రహ్మణః పూర్వం బ్రహ్మణ్యాం కాశ్యపోఽజని। జగత్పితామహో యస్య సాక్షాద్దేవః పితామహః......తదన్వయే సముత్పన్నా బ్రహ్మణ్యా బ్రహ్మవాదినః। యజ్వానస్సర్వ్వయజుషాం దృష్టాంతా దృష్టిపావనాః। తేషాం మహోన్నతే వంశే సంజాతో రాజభూషణః। సువృత్తో రుచిరః కశ్చిన్ముక్తామణిరివ ద్విజః। సర్వ్వజ్ఞతా మనితరాస్పద మీశ్వరత్వం। లోకోత్తరం సుచరితం జితమన్మథత్వం। అశుప్రసాదమపి సత్ఫలదం విలోక్య।యం చంద్రభూషణమితి ప్రవదంతి లోకాః......విశ్వం విస్మయతే య స్స్వగుణగ్రామైః ప్రతిక్షణం ససర్వ్వజ్ఞః క్రియాశక్తి రాత్మా యస్య తపోమయః......తస్య శ్రీచంద్రభూషణాచార్య్యస్య చరణసరసిజ......రాజాధిరాజో మహారాజపరమేశ్వరశ్శ్రీమన్మహామండలేశ్వర శ్శ్రీవీరబుక్కభూపాలః......చంద్రభూషణాచార్య్యాయ......రిపుబలారణ్యసమున్మూలన నిజభుజశ్రమవిజయమహోత్సవం......సమర్పితవాన్ - కించ శ్రీచంద్రభూషణాచార్య్యపదపంకజయో స్తథా గ్రామం కొండూరునామానం బుక్కక్ష్మాపతిరార్పయత్...... యతీంద్రస్యక్రియాశక్తిగురోః ప్రీతయే శ్రీచంద్రభూషణాచార్య్యః......కొండూరునామానం గ్రామం ద్విపంచాశద్బ్రాహ్మణేభ్యః ప్రజాయ క్రియాశక్తి. గురోరుపదేశయతి నామ్నా తస్యగ్రామస్య దేవేశపురమితి నామ కృతవాన్.

## నవనాథచరిత్రపీఠికనుండి.

ద్వి. ఒకనాఁడు మద్భాగ్యయోగంబుకతన, శ్రీమహనీయప్రసిద్ధిఁ బెంపెసఁగు, శ్రీమల్లికార్జున శ్రీమహాలింగ, సర్వలోకోత్తమ సామ్రాజ్యభార, నిర్వాహకప్రౌఢనీతికోవిదుఁడు, సహనాబిరుదజైనకోలాహలుండు, మహి

తబిజ్జలరాయమానమర్దనుఁడు, సన్నుతశైవదీక్షాగురుం డపమ, సన్నాహ గజపతిసప్తాంగహరుఁడు, శ్వేతాంబర ప్రాణ వితత జీమూత, జాతమహో దగ్రి జంఝూనిలంబు, పరసమయాంభోధి బడబానలుండు, పరశరణాగత వజ్రపంజరుఁడు, మలయుచు మౌక్తిక కంఠమాలిక మెఱయఁ, గరభూషణంబుల గలవజ్రరుచులు, పగిగి నభోమణిప్రభలపై నడఁగ, తళతళమను నవతంస మాణిక్య, లలితకాంతులు కపోలములపైఁ బొలయ, నవరగాఁ జుట్టిన జడల నెట్టెమునఁ, జివురుకెంజాయమించిన పాగ మెఱయ, పొలుపుగాఁ గర్పూరమున మేళవించి, పలుచగా నలఁదిన భసితాంగరాగ, సమున్నతోజ్జ్వలకాంతిచంద్రికల జనుల, కన్నుఁగల్వలకు వికాసంబు నెఱప, ప్రమథసర్గము గొల్వ రజితాద్రిమీఁద, ప్రమదమారఁగనున్న పరమేశుఁడనఁగ...............రూఢి కెక్కిన మునీంద్రులు తత్త్వవిదులు, మఱి పదవాక్యప్రమాణజ్ఞులగుచు, బరగు విద్వాంసులు బహువిధకావ్య, నాటకాలంకారనైపుణిఁజాల, జాటువ కెక్కిన సత్కవీశ్వరులు, నల రాగదోషంబు లాఱునెన్మిదియుఁ, దొలఁగించి గుణము లైదును రెండు నెలమిఁ, దఱకొని గాత్రియంత్రమ్ముల నేర్పు, గలిగి వాసికి నెక్కు గాయకోత్తములు...............దొరలు భృత్యులు నమాత్యులు పురోహితులు, పరిచారకులు రాయబారులు వైద్య,వరులు దైవజ్ఞులు వరుసతోఁ గొలువ...............నిరుపమశివతత్త్వ నిర్మలమతికి, పావనునకు సర్వభాషావిశేష, కోవిదునకు రాయగుణశిఖామణికి, దుర్వార శైవ సింధురమృగేంద్రునకు, సర్వజ్ఞునకు ముక్తిశాంతరాయనికి.

## దాక్షారామ శాసనము.

"శకవర్షంబులు ౧౩౦౩ గు నేంటి వైశాఖ శు ౧౦ గు"

సీ. నందిదీపావళి నాట్యకల్యాణహోమ శనివారగయార్కమండపములు
తిరుచుట్టుమాలియ దివ్యలింగంబులు గుళ్లువజ్రంపు బాకోటగోపు

రములు పాతాళగేహములు సోపానభాండాంగార వివిధధాన్యాలయములు
వంటయిండ్లు (?) చతుర్ద్వారవాటములు (సు)ప్రేమదాక్షారామభీమనాథు

గీ. నగరనాచంద్రతారకోన్నతులు దిశల । వెలయజేయించె ననవేము
(వేమరాను?) । విజయచండద్ధముని? జగతొబ్బగండఁ డహిత । ఖండనోద్ధ
తదోర్దండమండనుండు.

సీ. అమరాద్రిభీమేశ్వరావాస మబ్ధిపత్తకము శ్రీసప్తగోదావరంబు
పలయాచలేంద్రంబు వజ్రంపుప్రాకోట కులపర్వతంబులు గోపురములు
తిరుచుట్టుమాలియ యరవిందజాండ మమర్త్యలోకము నాట్యమండపంబు
పరివారదేవతాభవనంబు లీచతుర్దశభువనమ్ములు (దా) రకములు

గీ. కనకకుంభతతులుగాఁగ దాక్షారామ, మన్నవీ (పోత?) వేమనానుజుండు
కడు నపూర్వసృష్టిగావించి వాసనకెక్క (శ్రీవేమ నియతయశుఁడు?)

—ప్రకాశభారతీయోగికావ్యము.